# ప్రభవ




సంపాదకత్వం

**టి. శ్రీరంగస్వామి**




Estd. 1977

# ప్రభవ

(కవితా సంకలనము)




సంపాదకత్వం

డా|| శ్రీరంగస్వామి

శ్రీలేఖ సాహితి
5-11-~~114/4~~ 481 విద్యారణ్యపురి
వరంగల్లు - 506009

"ప్రభవ" ఉగాది

ముద్రణ: నటరాజ్ ప్రింటర్స్, వరంగల్లు.

ప్రచురణ: శ్రీలేఖ సాహితి అయిదవ పుస్తకం

హక్కులు: సంస్థవి

వెల: ఒక సహృదయం

# "ప్రభవనాదం"

తెలుగు సంవత్సరాల చక్రంలో ప్రభవ తొలిది. ఈ ప్రభవకు ఇది తొలి సంకలనము. గత ప్రభవ గురించి తెలియనివారే ఈ సంకలనములో చోటుచేసుకున్నారు. గతంలో "ప్రభవ" పేరుతో ఒక త్రైమాసిక పత్రిక వెలువడినట్టుగా, ఆ పత్రిక ద్వారా శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి, జానుమద్ది హనుమచ్ఛాస్త్రి, వేదుల మొదలగువారు సాహితీ ప్రపంచంలో స్థిర స్థానమును సంపాదించుకొనినట్టుగా వినికిడి. ఈ "ప్రభవ" లోని కవులుకూడా ఆ స్థాయిని పొందగలరనే ఆశ నాకుంది.

ఈ సంకలనములోని కొందరు సాహితీ ప్రపంచానికి పూర్తిగా కొత్తవారైతే, మరికొందరు లబ్ధ ప్రతిష్టులు. కొందరు పరిచితులు. ఈ విధముగా 'ప్రభవ' సంకలనమునకు ఒక ప్రత్యేకత ఉన్నది అని భావిస్తున్నాను. అది పాఠకులు, విమర్శకులు నిర్ణయించాలి, ఇందులోని కవితలన్నీ సాధ్యమైనంత వరకు విమర్శకు తట్టుకుంటాయని భావిస్తున్నాను.

ఈ ప్రయత్నంనకు వెన్నుతట్టి అండగా నిలిచిన సాహితీ మిత్రుల ఔదార్యమునకు కృతజ్ఞతలు.

సాహితీ మిత్రుల సమైక్య భావస్ఫూర్తికి ఇది ఒక మధుర స్మృతి. సహృదయులు దీనివెనుక ఉన్న చైతన్య స్రవంతిని పోల్చుకోగలరనీ, వారి సహాయ సహకారాలను అందించగలరనే నమ్మకంతో....

మీ,

30-3-87 (ప్రభవ ఉగాది) టి. శ్రీరంగస్వామి

హన్మకొండ. శ్రీలేఖ సాహితి, వరంగల్లు.

## శ్రీలేఖ సాహితి ప్రచురణలు

| | | |
|---|---|---|
| శ్రీరామ శతకము - శ్రీ టి. రామానుజస్వామి | — | 10-00 |
| కవితాగానం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి (కవితా సంపుటి) | — | 3.00 |
| ద టు జంటిల్‌మెన్ ఆఫ్ వెరోనా - శ్రీ జి. దామోదర్ (తెలుగు అనువాదం) | — | 15-00 |
| వేణు తరంగాలు - శ్రీ యల్. వేణుగోపాలరావు | — | 5-00 |
| పరిభవ (కవితా సంకలం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | | |

## -: లభ్యపడు పుస్తకాలు :-

| | | |
|---|---|---|
| మధుర (కవితా సంపుటి) - శ్రీ టి. శ్రీరంగస్వామి | — | 10-00 |
| దీపిక (కవితా సంపుటి) - కుమారి భండరు విజయ | — | 6-00 |
| శిఖరం (కవితా సంపుటి) - శ్రీ టి. శ్రీరంగస్వామి | — | 3-00 |
| విపంచి (వ్యాస సంపుటి) - శ్రీ టి. శ్రీరంగస్వామి | — | 4-00 |

# గవేషణ

— దాశరథి

గవాక్షంలో నుంచి గదిలోకి
గంతు వేసింది దౌర్జన్యం
కత్తిపోట్లకి తట్టుకోలేక
నెత్తురు కక్కి మరణించింది సౌజన్యం

పట్టపగలు నట్టనడివీధిలో
పట్టుపడకుండా వెళ్ళిపోయింది దౌర్జన్యం
సౌనఃభూతిపరులు నిర్మించిన పాలరాతి
సమాధిలో పవ్వళించింది సౌజన్యం

దానవులు విజృంభించిన ధరామండలంలో
మానవులకోసం జరుగుతోంది అన్వేషణ ।
యెడారిలో పుడిసెడు నీళ్ళకోసం
ఇసుకలో తైలధారకోసం గవేషణ ।

# వణుకుతున్న గ్రహమండలి

— డా॥ సి. నారాయణరెడ్డి

శోక తప్త వైరాగ్యం చుట్టు ముసురుకున్నది
పేదవాడి వేదనలా వెన్నెల పడుకున్నది.

అలా అలా మేలుకున్న తెలివి తలుపు తెరవగా
ఇలా ఇలా మనిషి గుండె గిలగిల మంటున్నది.

గుంపులోన ఒంటరిగా కునికే ఓ మానిసీ !
ప్రతి నగరం దేవదాసు ప్రతిమలాగ వున్నది.

కొత్తరకం పరీక్షకుల కొలమానం తెలుసులే.
దాని చూపు మనిషి వస్త్రధారణపై వున్నది.

పొగచూరిన కిరణమైన అగుపించదు ఇక్కడ.
కటికిలేమితో అద్దిన పటం ఎదుట వున్నది.

సమసమాజవాదమొక విషమ వివాదమే సుమా !
అడుగు మనిషినెత్తిమీద గొడుగు పడగ వున్నది.

తళుకుమనే మృత్యుమూర్తినెలాగ చూశాడో
సూరదాసు జీవిక జోహారులందుకున్నది,

నేలమీద నరుడు ప్రయోగాలు జరుపుతూంటే
ఏమి ఖర్మ! గ్రహమండలి ఇలా వణుకుతున్నది.

# మమత

— "సరసకవి" అద్దంకి రామానుజాచార్యులు

మమతకున్నది ఘనత
మరువలేనిది యీ చరిత ।
సాహితీ మమతల నడత
స్నేహానికి సుమ కవిత ।
సుమకవితల మమత
తొలగించును జడత ।
సజ్జనులకు సాహితీలత
తొలగించును కలత ।
సాహితీ మిత్రుల మమత
చెప్పగలమే, ఘనత ।
ఘనతగల మమత
బుధ జనులకు చరిత ।
మమతలకు గల మాట
మంచి ముత్యాల మూట
పులకించును ఈ జగతి
మదినింపును కాంతి ।।

# జెండా

— రఘుశ్రీ

తన గొంతుకి తాడు బిగించి
స్తంభం ఉపరితలంలో ఉరితీస్తున్నారని
ఊహించి ఉక్కిరిబిక్కిరి అయ్యిందేమో?
జాతినేతల చేతుల్లోంచి జారుకుని
స్వేచ్ఛగా ఎగిరింది నా వన్నెల జెండా!
సంతోషంగా, 'స్వతంత్రంగా' నింగినిండా!

# అక్షరాలు నా నేస్తాలు!

— గరికపర్తి రాజేంద్ర

ఈ హృదయంలో పుడుతుంటాయి
క్షణం, క్షణం, లక్షల ఆశాకుసుమాలు!
ఈ పిరికెడు మనస్సును ఉక్కిరిబిక్కిరి చేస్తూ!
మోయలేని బరువును మోయలేక మోస్తూ!
అక్షరాల నాశ్రయిస్తాను!
ఈ హృదయం పగిలిపోకుండా
నా ఆశాలత వాడిపోకుండా!
పుట్టుకొచ్చే ఆశాకుసుమాల్ని
అక్షరాల్లోకి అనువదించి
కాగితాలకతికిస్తాను!
నాబరువంతా వాటికప్పగిస్తాను
ఈ అక్షరాలతికించిన కాగితాలే సాక్ష్యాలు
నా ఆశాకుసుమాలకు!
అక్షరాలే నా నేస్తాలు
నా ఆశల బరువు మోసేందుకు!

హెడ్ పోస్టాఫీసు, కామారెడ్డి, నిజామాబాదు

# యు (ఉ) గాది

— అవాల దామోదర్ రెడ్డి (కమలశ్రీ)

ఏటేట నాపాట వినిపించగలను
ఎదఎదన ధర్మమే వెలిగిపోవలెను ;
మదిమది వేపగాలివలె పరుగిడవలె,
మానవత చైత్రవనమై విరియగవలె ;

వసంతుని ఆశయము పందెరసాలము
ఏ సమరుడో దొంగ అనుచరుడు మతము
శాంతిని హింసించి తోటను చెరచునా ;
చింతనంత నేనిటులనే ద్రావనా !?

గరళకంఠము నాది గళమెత్తి పాడనా ;
సురగంగవలె ఓల్గామైత్రియేపారునా ;

పాపపంకిలమే ఎండిపోగలదు సుమా ;
భావన రవినైమండ చిగుర్చుగా ప్రేమ ;

ఆమని ఆశాకథల బ్రతుకులు పూయవలె
అవి మల్లెలుగ శ్రమ విజయమునే పాడవలె ;
ప్రకృతిని నే పిల్చితిని, ప్రగతి గుడియు(ఉ)గాది
ప్రభవ శాంతిపూజ, శశితారల కృషియునిది ;

ఇ.నెం. 25-11-140/1 బాపూజీనగర్, పోస్టాఫీసు దగ్గర, ఖాజీపేట.

# యావ

— డి. శ్రీధరాచార్య

నేటి సమాజంలో
డబ్బు లేకపోతే సర్వం శూన్యం
ఆత్మీయతలు - ఆడంబరాలు
ప్రేమలు - వేడుకలు - పెళ్ళిళ్లు
బంధనాలు - అన్నీ బలాదూర్
అన్నలేడు కట్నాలు పెట్టనిచో
భర్త లేడు కులాసాలు తీర్చనిచో
తండ్రిలేడు పాకెట్ మనీ ఈయనిచో
బంధుత్వం లేదు బహుమతులు తేనిచో
ప్రతివాడిలో 'యావ'
డబ్బు యిబ్బడి, ముబ్బడిగా పెంచాలని
చిటికెలో లక్షలు, కోట్లు గడించాలని
ఈయావను తీర్చుకోవడంలో
మనుష్యత్వం - మానవత్వపు
కంఠాన్ని నులిమేస్తోంది
'సమాజం' గుడ్లు మిటకరించి చూస్తోంది
తనకూ అందులో "భాగం" వుందని

జైనద్, ఆదిలాబాదు - 504 365

# శక్తి స్వరూపిణి

— శ్రీవీణ

ఈ ధరిత్రి చరిత్ర ఒడిలో
వరకట్నపు మంటల్లో
నిత్యం వినిపించేవి
సజీవ దహనపు కేకలు
అనునిత్యం కనిపించేవి
మలిగిన జ్యోతుల గాథలు
యింకా ఎన్నాళ్ళో కాదీ వ్యవస్థ
అబల సబలగా మారేవరకే....
కఠినాత్ముల అంతం చూసే వరకే
వ్యక్తికాదు తానొక శక్తినని చూపేవరకే

# ఈల

— టి. ఇందిర చిరంజీవి

ఒక సుందరమైన సంధ్యా సమయాన
ఫలపుష్పభరితమైన తోటలోన
కూరుచుంటిని పొగడచెట్టు నీడలోన
పాడుచుంటిని పాటలో లీనమై
భావతరంగములు అలనల్లన నడయాడ
మలయమారుత రాగాలాపనలో
మెలమెల్లగావీచు చిరుగాలులలో
రాలుచుండె ఎడనెడ పొగడపూజల్లులు
(అంత)వీనులకుసోకెను సన్నని ఈలధ్వని
గానమాపి అటునిటు చూసితి
ఓహో! ఎవరో! కొంటె కుర్రవాడు
కుర్రతనమున ఈలవేసెనటంచు
కానరాదేడీ కనుచూపుమేర
మరల పాడుటకు మొదలిడితి
సాగించెను పోటీగా ఈలపాటను పోకిరి
క్రోధమున పలువైపుల దృష్టిసారించితి
కనుగొంటిని చెట్లగుబురులలోన
అమ్మదొంగ! దొరికినాటడంచు
అంతరంగమున అహ్లాదమందింతి!
తుంటరి కస్తూరి పిట్టనుజూచి!

శ్రీనిలయం, రామలింగేశ్వరపేట, తెనాలి – 522 201

# గిట్ల జరుపుకుందాం!

— వరిగొండ కాంతారావు

దొరసానికి పోరలు మస్తు
సొమ్ములెండిపాయె
పాల్జాలక పాయె
దొరసానికి ఒక దాసిది
తనబిడ్డల నోరుగట్టి
దొరబిడ్డకు పాలుదాపె.
దాసిదాని పాల్జీకిన
దొరబిడ్డలు మారాజులు
దాసి 'లంజె' పోరలకు
నాగరికము తెల్వదనిరి.
ఏదడిగినగాని సీకు
ఎందుకు పోరా అనిరి.
దొరసానిది పట్నమాయె
దాసిదేమొ మెతుకుసీమ
గులాపోల్ల మేం జేస్తం?
గిట్ల జరుపుకుందాం

యల్.ఐ.సి., రామాయంపేట, మెదక్-502 101

# మానవత్వము

— ఉషాకిరణ్

కళానికి లేదు కులం
"దళం"నకు లేదు మతం
హితములో కలదు మమత
సమాజ శిలలను
సహన ఉలితో
మలుచు శిల్పాన్ని
సుత్తితో నిరాశ దెబ్బ వేయకు,
చెదిరిన గుండెలను
చిగురు మెత్తని రూపాన్ని
హృదయ లయముతో సాధించు
కళామయమైన జీవికలోనే కలదు
సంఘ శ్రేయస్సు మానవత్వం
నిరంతరము సాగిపో కడలిలా?

ఆమంచ విశ్వపతి, ఘనపురం స్టేషన్, వరంగల్లు—506 143

# కాక మరేమి

— ముడుంబై వరదాచార్యులు

భౌతికతయే భవ్యమనుచును
పరముకడకును నెట్టివేసి
కుటిల రాజకీయరాగం
రమ్యంగా జీర్ణించుక
రంగు రంగు కలలుగనుచు
ఊహాలోకాలను
ఉత్సుకతో గననేర్చిరి
నేతనేర్పు కౌటిల్యం
కాదంబరి కమ్మదనం
ఒడలెరుగని ఉద్రేకం
ఫలితంగా క్రౌర్యం,
ఏరంగం కనుగొన్నా
వీరంగం తాండవించె
అక్షయంగ క్షయముజేయ
ప్రభవించెను ప్రాభవమని
సంతసించి బ్రతుకుదారి
సాగువింక వెతయేలని
(తృప్తిపడక తప్పదెపుడు)
ఆశించుట అతికాంక్షే

ఇ.నెం. 1-686, నర్సంపేట, వరంగల్లు-506 132

# మరచిపోకు మానవుడా!

— భువనగిరి నాగరాజు

నీ అక్షులలో –
ఆవేశాల అగ్నిపర్వతాల రగిలింపులెందుకు ?
ఎదఎదలో ఆనందనందనాలను పెంచగలగాలి ,
నీ తలపులలో –
అణ్వాయుధాల వ్యూహాల రచనలెందుకు ?
అందరికీ
అనురాగ మరందాలను పంచగలగాలి !
మరచిపోకు మానవుడా !
దేశాలు, దేహాలు – రాష్ట్రాలు, భాషలు వేరైనా
మమత నీమతం – సమత నీ కులం !
నీ మాటలు – వెన్నెల జల్లులై కురవాలి !
నీ చేతలు – మల్లియ పువ్వులై విరియాలి !
ఆవేశం అవుతుంది – నీ జాతికి సమాధి !
మానవత్వం కావాలి – నీ మతానికి పునాది !!

6–3–182/ఎ, మంచాలవీధి, తిరుపతి 517 507

# ధర్మం

— శ్రీమతి ఎస్. మోహినీ ప్రసాద్

వస్తున్నా నే వస్తున్నా ప్రళయ కాల గర్జనలా
సముద్రపు ఉప్పెనలా ఎడారిలో తుఫానులా
కాలసర్పము కాటులా వస్తున్నా నే వస్తున్నా

అన్యాయం అక్రమాలను నశింపజేస్త
నీతికి నిజాయితీకి పీడను ఇస్తా
దౌర్జన్యం దోపిడీలను అంతం చేస్త
అభ్యుదయం అందరికి నే అందించేందుకు ॥వస్తున్నా॥

దగా నాయళ్ళనందరిని శిక్షించేందుకు
బుద్ధిలో బృహస్పతులను రక్షించేందుకు
మోసగాళ్ళ చేతులను ఖండించేందుకు
మోతుబరుల గుండెల్లో నిద్రించేందుకు ॥వస్తున్నా॥

పెద్దలనంతా మిద్దెలనుండి దించేందుకు
పేద, గొప్ప విభేదాలను తెంచేందుకు
సమానత్వం అందరిలో ఉంచేందుకు
అధర్మాన్ని కాలరాచేందుకు
ధర్మదేవతను నే వస్తున్నా

బి. బ్లాక్స్ బి. 25, మలకపేట కాలనీ హైద్రాబాద్.

# చార్మినార్ మరణాలు

— టి. మల్లయ్య

నవంబర్ పదిహేడు। నవోదయానికి పునాదులు।
చార్మినారు మరణాలు। చరిత్ర పుటలో లిఖితాలు॥
పద్మజ, గిరిజ మరణాలు। కుటుంబాలకే సంకేతాలు।
నలుగురు కుటుంబమరణాలు। నరలోకానికే కన్నీరు॥
అన్నగపుట్టిన అన్నయ్యలకే। అకాలమరణము జరిగేనా।
ఆడగపుట్టుట పాపంకంటె। గిట్టుటమేలని తలచేనా॥
వరకట్నపు కోరల్లో। అమాయక జీవుల మరణాలు॥
చాలీచాలని సంపాదనతో। కాలముగడిపే జీవులెందరో।
అత్తమామల పోరుతో। చాలీచాలని భర్తలతో॥
అగ్నికి ఆహుతి కొందరు। మరణమే మేలను ఎందరో।
పేరముకోసము చదువులుచదివి। అక్షరాలుగా లక్షలు అడిగి॥
అభాగ్యజీవుల ప్రాణాంతీసే। ధనకామాందుల తరమండి।
కదం కదం కలపండి। అడుగులో అడుగు వేయండి।
దేశసేవ చేయండి। జగతికోసమే నిలవండి॥

పుల్లెంల, చండూరు, నల్లగొండ

# ప్రభవావిర్భావం

— కె. వి. సంతోష్‌బాబు

కాలచక్రమదిగదిగో
వడివడిగా పరుగిడుతూ
మరో కొత్త వత్సరాన్ని ప్రసాదించబోతుందట
'క్షయ' లోపలి రాక్షసత్వ
మతమౌఢ్యపు క్షయరోగం
అంతరించి పోత్నుందట. 'క్షయ' క్షయమై పోతుందట
మానవత్వమీ మహిపై

స్థిరమై వెలుగొందేనట
సుఖ శాంతులు, సంతోషం
పృథ్వివి ప్రభవిస్తాయట.
కరవు కాటకాలు లేక
ప్రశాంతిగా ప్రజలంతా
నవ్వుల పూజల్లులతో
బ్రతికే శుభ వత్సరాది
ప్రభవ శుభాగమనానికి
స్వాగత గీతిక వ్రాస్తా.

# జవాబు చెప్పండి

— నములికొండ బాలకిషన్‌రావు

బానిసత్వం నుంచి
బానిసత్వం వరకు ఎదిగిన
ఈ స్వేచ్ఛా స్వతంత్ర ప్రపంచ రాజ్యాలలో
ఇంకా చస్తూ బ్రతుకుతున్నాం
కొందరికి బట్టలు లేక
మరెందరికో తిండిలేక
కొందరి అగత్యాలకు
ఇంకెందరో రక్తసముద్రంలో ఈదుతున్నారు
ఎందరో అభాగ్య స్త్రీల
కన్నీటి సముద్రాలు పొంగుతున్నాయి
ఏ మానవత్వం.... చెలియకట్ట వేస్తుంది
ఇంకా....
ప్రపంచం భస్మీపటలం కాకముందు
ఆకాశంలో అణుయుద్ధం జరపకముందు
అహం, డబ్బు, స్వార్థం
మూడు మనిషిలో కూరుకుపోయి
ద్వేషంతో తన్నుతాను భస్మం కాకముందు
ఈ యుద్ధ ప్రయత్నాలు ఎందుకు
ఒక్కసారి చెప్పండి జవాబు

6-7-42/ఎ, రాగన్నదర్వాజ, హన్మకొండ, వరంగల్లు-506 011

# నిరీక్షణ

— వీరాచారి

కలల ఇంద్రధనస్సు మీద
కన్నీటిబొట్లు రాలుతున్నాయి
తుపాకి గొట్టాలు అహింస
సిద్ధాంతాన్ని వల్లిస్తున్నాయి
పులులు మేకల్ని కాస్తున్నాయి
ఏర్పాటువాద వల్లకాట్లో
జాతీయత పురుడు పోసుకుంటుంది
నేస్తం! ఇదే మా ప్రజాస్వామ్యం
ఆచరణలేని సిద్ధాంత జెండాలు
ఆకాశంలో ఎగురుతున్నాయి
ఆకలితో మాడే డొక్కలు
ఎలక్షన్ల వైకుంఠపాళిలో
మందు, మగువ, డబ్బు దౌర్జన్యాల
సర్పం వాతబడుతున్నాయి
నిజాన్ని తిలకించే కళ్లలో దైన్యం తప్ప
ధైర్యపు అగ్నికణికల్లేవా?
అరాచకం నియాన్ బల్బులా వెలుగుతుంది
అయినా! నిన్నటి నుంచి నేటిలాగ
నేటినుండి రేపు పుడుతుందన్న
ఆశతోనే నిరీక్షిస్తున్న ప్రభవ కోసం

---

పరిశోధన విద్యార్థి తెలుగు విభాగం, కాకతీయ విశ్వవిద్యాలయం వరంగల్.

# జాగరణ

— పెద్దూరి వెంకటదాసు

నండూరి ఎంకి విశ్వనాథ కిన్నెరసాని
భావకవితలయందు బోసిల్లు పూబోడి
కాలేజీ కుర్రాళ్ళ కలల రాణి
కిట్నమనేదొకటి విన్నా కలిస్తుందని
కన్నెపిల్లల బ్రతుకు కన్నీటి గోదని....
ఆడుతూ పాడుతూ వెళ్ళిన నలుగురు అక్కాచెల్లెళ్లూ
"చార్మినారు ఎక్కి దూకిరంట"
అభద! నీకావార్త అందలేదా!
నీకునీవే శత్రువన్న నాదం ఉంది
నీవు తలచుకుంటే చేయలేనిదేముంది
ఉగ్గుపాలు పట్టిన తనయుడే
సిగ్గుతో తలవంచుకునేలా చేస్తుంటే
ఏమిటీనీ మౌనం....?
ఆపకపోయావో ఈ మారణహోమం
స్త్రీ జాతికే నష్టం

Qt. No. J/673, NRRP Colony, Site 2,
బోడబండ, హైదరాబాదు.

# ఆశ

— తాతిరాజా

అక్కడేదో
కళాకారుల పోటీ జరుగుతుందంటే
నువ్వు కనిపిస్తావేమోనని
ఆత్రంగా వెళ్ళి
విజేతల బృందంలో కళ్ళతో వెదికాను.
నీజాడ లేదు
హతాశుణ్ణయి మరలివచ్చేక
ఆలస్యంగా స్ఫురించింది—
తీర్పరుల వరసలో
నువ్వున్నావేమో!

2-2-161, కిషన్‌పుర హన్మకొండ—506 001

# జీవితం

— కుందారపు పద్మావతి

అర్థం లేని జీవితం
నిరాశ నిండిన కెరటం
సహృదయత లేని హృదయం
లక్ష్యం లేని జీవితం
అవుతుంది నిరర్థకం
తృప్తి లేని మనిషికి
ఆశాకిరణం జీవితం

# చీకటి - వెలుగులు

— యల్. వేణుగోపాల రావు

చీకటింట్లో మనమున్నా
చీకటి బ్రతుకులు కాకూడదు
ఆశలు తీరకున్నా
నిరాశ చెందకూడదు
సూర్యచంద్రులు అస్తమించినా
మమతలు అంతరించకూడదు
జీవిత పోరాటంలో ఓడినా
రేపటి పోరాటంలో గెలుపు తప్పదు
కాలయముడే ఎదురుపడ్డా
జడిసి లొంగకూడదు
నింగి సుఖాలుమవి కూలినా
మనస్థయిర్యం వదలకూడదు
పలువురి పకపకలు విన్నా
మనిషి వెలవెల పోకూడదు
ప్రపంచమంతా శత్రువులైనా
ఎదురించుటకు వెనుదీయకూడదు
మనుషుల వైఖరి మారితే
బ్రతుకు చీకట్లు తొలగవచ్చు

క్వార్టర్ నెం. 5, యన్.జి.వో. కాలనీ, వడ్డెపల్లి, వరంగల్లు - 506 369

# ధనస్వామ్యం

— కొమర్రాజు రామలక్ష్మి

ప్రజాస్వామ్య ముసుగులో
ధనస్వామ్యం రాజ్యమేలుతున్నది
అన్యాయం అవినీతి ఆయుధాలుగా
దోపిడీ దౌర్జన్యాలే లక్ష్యంగా
ధనవంతుడు ధనహీనుడిని
బలవంతుడు బలహీనుడిని
అణచివేసే సంప్రదాయం
అలాగే కొనసాగుతున్నది
ఈ రెండు వర్గాలమధ్య ఎప్పటికీ
అంతులేని అగాధమే
ఈ అసమాన వ్యవస్థలో సామ్యవాదం
కేవలం ఒక నినాదమే.

3–1–40, కాకతీయ కాలని, హన్మకొండ - 506 011

# లాంఛనవాదం

— "రామభోజ"

అడుగడుగున లాంఛనము
సర్వవేళలా నీకు నీరాజనము
నీ, నా స్వపర భేదం లేదు, ఇది నిజం
సత్యాల మర్యాదలు అందుకునుటే, నీ ధ్యేయం
సకల భోగాలను భరించుటే_
లాంఛనప్రియుల జీవిత లక్ష్యం
సర్వే సర్వత్రా నీ ప్రభంజనం
పీడితుల అమ్మా, య్యా పునాదులపై
అందంగా అద్దాలమేడలు నిర్మించి
ఆపై సఫారి సూట్లు ధరించి
ఏసి కార్లలో విహరించి
మధురామృతము సేవించి
రంగరంగ వైభోగంగ
జగమేలుతున్నారు, నీ భక్తులు
వల్లెవేస్తున్నారు ఆపై గాంధీ సూక్తులు
మిగిలింది మిగులుతుంది_పీడితుల కెముకలగూడు
వినేదెవరు ఆ దీనులగోడు
వీయక మానదు ఝంఝా మారుతం ఒకనాడు
తప్పదు లాంఛనాల మేడకు వినాశమానాడు

బి. రాములు, ఇ.నెం. 5_43, సప్తగిరి కాలనీ, కరీంనగరం - 505 002

# భావ వీచిక

— "లాలస"

దుఃఖసాగరం ఆవలివైపున్న
ప్రియనేస్తం....
నన్నా ఆ దరికి చేరమంటున్నావా
రావాలనే ఉంది కానీ....
మవ్వెక్కిన వయ్యారినావ
నేనెక్కితే తిరగబడ్తా నంటోంది
తన శరీరంమీద పడ్డ
నీ చరణార విందాల జాడలు
చెరిగిపోతాయనేమో
నువ్వెళుతుంటే
హృదయాన్ని చీల్చుకొని
తారల్ని రాల్చిన ఆకాశం
నే బయలుదేరుతుంటే
చిమ్మచీకటి ముసుగేసింది
నీముఖ చంద్రబింబం వాడుతుందేమోనని
మబ్బులచాటుకెళ్ళిన సూరీడు
నాపై నిప్పుకణికల్ని విసురుతున్నాడు
అయినా....
నేనటువైపుకెందుకు లెద్దూ
ఎలాగూ నా గుండె నీతోనే ఉందిగా....

ఎ. శ్రీకాంత్, ఇ.నెం. 5-11-114/2, విద్యారణ్యపురి, వరంగల్లు.

# స్మరించి తరించుదాం

— గులాంనబి

ఓ పరిభవా! నీ ప్రభావ ప్రవాహానికి
ఎఱయైన వారిలో — ఎదురీదేవారిదెంత శాతం ?
నీవు ప్రభవించిన నాటినుండి — ఏఏట పుట్టినరోజు పండగలు
అరవైవత్సరాల కొకమారు — షష్ఠిపూర్త్యుత్సవాల సంబరాలే-కాని;
ధర్మాధర్మాలు తారుమారై — ధరాతలి దరహాసం జేస్తుంటే
భక్షకుల రక్షించే వారేకాని-శిక్షించే నాథులే లేక,
అధికార కామ దాహానికి-ఆస్తులు పెంచే పిపాసకు-
వాయుగుండాలకు-వాహనాల ప్రమాదాలకు
బలియయ్యే ప్రాణాలెన్ని? చితికిపోయే బతుకు లెన్నెన్ని? ॥ఓ॥
ఇకనైనా — అతిశయమైన అరిష్టాలు క్షయమై
ప్రజలు కోరు ప్రశాంతత ప్రభవమై
తీపిచేదు ఒగరు పులుపుల మిళిత పరిభవ 'పచ్చడి' గ్రోలినట్లు
సుఖ దుఃఖాల జీవిత పాయసాన్ని గ్రోలుటద్వారా
వినూతన విశ్వకళ్యాణాన్ని ఆశించుటేకాక;
మనమంతా ఏకమై -ఏకైక సర్వేశ్వరున్ని
భక్తితో సదా స్మరించి తరించుదాం !

ఇ.నెం. 3-4-84/బి, రాయపుర, హన్మకొండ, వరంగల్లు-506 011

నేనవంతంలో
భాగస్వామివి
విశ్వంలో
సగభాగాన్ని
నేను తలచుకుంటే
అనంతాన్ని ఆవిరి చేయగలను
విశ్వాన్ని నాశనమొందించగలను
నన్నబలని మరోసారి అన్నావా....!
నా హక్కులను కాలరాచేస్తావా?
నా ఆలోచనలకు అడ్డం వచ్చావా....!
నిన్ని ప్రపంచ ప్రళయాగ్నిలోకి
ఆహుతి చేస్తాను
స్వరూపాన్ని మసిచేస్తాను
నేను నేటి
నవనాగరిక
నవగీతిక "సబల"ను

# కవిత

— యం. రత్నాకర్ రావు

మధుర స్వప్నాలలో
మూగమనసు భాషలతో
ప్రేమానురాగాల ఘర్షణలో
అర్థంకాని ఆలోచనలతో

విందు పున్నమి వెన్నెలలో
కోర్కెలు పెంచే కల్పనలా
కరగించే కాలకన్యలా
లోగిలిలోని అభిసారికలా

తొలగించిన అడ్డుతెరలలో
తీయనైన చిరునవ్వులతో
చిలిపి కన్నుల చూపులతో
కాలి అందియ రవళులలో

నాలోని రాగాన్ని వనితలా
నాలోని గానాన్ని కవితలా
నీలో వ్యక్తిత్వం చేసుకోవా
నా కవితకాని కవిత.

కె. ఐ. టి. యస్. వరంగల్లు – 506 015

**PRABHAVA** an Anthology or Freeverse Poetry
Edited by T. Sri Ranga Swamy, Warangal.



ఈనాడు ఎక్కువమంది కవిత్వం
అని రచనలు చేస్తున్నారు.
భావ స్ఫురణ కంటే - విషయం
చెప్పటం ప్రధానమయి పోయింది
రూపం, శిల్పం, విషయంలో శ్రద్ధ
ఉండటం లేదు:
అయితే ఈ "ప్రభవ"లో నూతన
వర్ష చక్రం ప్రారంభమయింది
రచయితల్లోనూ నూతన
దృష్టి, చైతన్యం కనిపించవలెనని
ఆశించడంలో తప్పులేదు.
ఈ సంపుటిలోని యువకులు
నా ఆశను సఫలం చేస్తారని
ఆశిస్తున్నాను.

**డా॥ కోవెల సుప్రసన్నాచార్యులు**
కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు.

A Publication of *Srilekha Sahiti* (Estd 1977)
Warangal-506 009 in the year 1987